ఓం

# తిరుత్తణి స్థలపురాణము



ప్రచురణ :-

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయము
తిరుత్తణి - 631209

వెల రూ. 2/-

ఓం

# తిరుత్తణి క్షేత్ర వివరణము

రచన:


శ్రీ విద్యానంద డాక్టరు. చె. రామలింగాచార్య

3 నెహ్రూ నగరు తిరుత్తణి—631209

చెంగల్పట్టు జిల్లా



ప్రకాశకులు:

శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారి దేవస్థానము

తిరుత్తణి — 631209

చెంగల్పట్టు జిల్లా తమిళనాడు

శ్రీ. ఎన్. ఎస్. రామచంద్రన్. బి.ఎ.,బి.ఎల్.  పేరంబాక్కం
డెప్యూటి కమిషనర్ /  గౌ॥ ఆర్. షణ్ముఖం. ఎం.ఏ.ఏ.,
నిర్వాహకాధికారి,  ఉపయుక్తాధికారి (ఫిట్ పర్సన్.
శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారి  శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారి
దేవస్థానము, తిరుత్తణి.  దేవస్థానము, తిరుత్తణి.

తిరుత్తణి క్షేత్ర మహాత్మ్యమును. ఇచట వెలసి కరుణపాలించు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారియొక్కయు మహిమను చెప్పతరము కానిది. పురాతనమైన ఈ మహాక్షేత్రము ప్రస్తుతము చాల ప్రసిద్ధిచెంది లక్షలాది భక్తజనులు విచ్చేసి. స్వామివారిని దర్శించి, సంతోషించగల పరిస్థితి, బహుశీఘ్రముగాను. ఆశ్చర్యపడు తీరుగాను అభివృద్ధిచెంది దినక్రమేణ వ్యాప్తి నొందుచున్నది. ఇటి పరిస్థితిలో ఈ క్షేత్రపు గొప్పదనము. మహాత్మ్యము. చారిత్రక ప్రశస్తి, మఱియు, ఇందుకు చెందిన సమాచాలములు మొదలగువానిని వివరించి విశదపఱచగల పుస్తకము ఒకటి మిక్కియు ఆవశ్యకమై యుండినది,

..తిరుకోయిల్ ..— అను తమిళ మాసపంచిక యొక్క పత్రికాధికారియైన కీ. శే॥ న. రా. మురుగవేల్. ఎం ఏ.,ఎం ఓ.ఎల్ ., గారు "తిరుత్తణిగై తలవిశక్కం"—అను చిన్న పొత్తమును సులభ గ్రాహ్యమును, మధురమగు నడకలోను. మిక్కిలి అందముగ తమిళ భాషలో రచించి యొనగినదానిని 1987 సం॥లో ముద్రించి ప్రకటించ డమైనది. ఆదే విషయసేకరణను ప్రస్తుతము తెలుగులో తొలిసారిగా ముద్రించి, ప్రచురించుటనుగూర్చి మిగుల సంతసించుచున్నాను,

ఈ పొత్తమును తమిళమునందు రచియించి సహకరించిన గ్రంథకర్త. కీ. శే॥ శ్రీ న. రా. మురుగవేళ్ గారిని తెలుగుభాషలోనికి అనువాదమొనర్చి ఒదవిన తిరుత్తణి వాస్తవ్యులు శ్రీవిద్యానందులను

డాక్టర్, వె. రామలింగాచార్యులవారికిని. దీనిని తెనుంగున ముద్రించుటకై శ్రద్ధతో అనుమతినొసంగిన చెన్నపురిలోని దేవాలయ ధర్మదాయ శాఖ పరిపాలనాధికారి గారైన శ్రీ క. సుందరమూర్తి ఐ.ఏ. ఎస్., గార్లకున్ను; ఈ గ్రంథమును ముద్రించి యిచ్చిన తిరుత్తణి. శ్రీనివాసా ప్రెస్ నిర్వాహకులు శ్రీ కె. జయరామన్ గారికిని మా మనఃపూర్వక వందనములు అర్పించుటేగాక, మేమెంతయు కృతజ్ఞుల మనుట తెలిపించుకొనుచున్నాము.

ఈ గ్రంథమును తెలుగులో ముద్రించి ప్రకటించగల భాగ్యము మాకు కలిగినందులకు సర్వేశ్వరుడైన తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారికి శిరసానతులొనర్చెదము: శ్రీస్వామివారి భక్తులెల్లరును ఈ గ్రంథముకొని, చదివి తరింతురు గావుత

(వ్రాలు) ఎన్, ఎస్, రామచంద్రం
4-3-1987

# తిరుత్తణిక్షేత్ర వివరణ

## ఉనికి

తిరుత్తణియను సుప్రసిద్ధ సుబ్రమణ్య క్షేత్రము చెంగల్పట్టు జిల్లాలో, చెన్నపు నుండి బొంబాయికి పోవు ఇనుపదారి మధ్య, అరకోణం జంక్షనుకు ఉత్తరముగ 13 కిలోమీటర్ల దూరమందును చెన్నపట్టణము నుండి వాయవ్యముగా 84 కి.మీ. దూరమందును ఉన్నది. ఇది తొండమండలమున నుండునట్లు తమిళగ్రంథములు చాటుచున్నవి.

తొండమండలమునకు రాజధానిగనుండిన కాంచీపురము ఇందుకు దక్షిణమందును; విరించిపురము, వళ్ళిమల, చోళింగపురములు పడమటను తిరువాలంగాడు తూర్పునందును; తిరుపతి, కాళహస్తి క్షేత్రములు ఉత్తరమందును చుట్టు ప్రక్కలనుండగ, వానికి మధ్య ఈ తిరుత్తణి క్షేత్రము వెలసియున్నది.

పురాతన తమిళగ్రథములందు తమిళనాటికి తిరుపతి క్షేత్రమును ఉత్తరపు సరిహద్దుగను గుర్తింపబడియున్నవి. కాని, ప్రస్తుతము ఈ తిరుత్తణియే తమిళనాడునకు ఉత్తరపు సరిహద్దు అయి విలసిల్లుచున్నది.

## తిరుత్తణి :

శ్రీ కార్తికేయుడను సుబ్రహ్మణ్యస్వామి దేవతలయొక్క కష్టములను పోగొట్టుటకై శూరుడగు శూరపద్మునితో చేసినట్టిపోరున్ను, వల్లీదేవిని పెళ్ళాడుటకై బోయకులజులతో వేడుకకై చేసిన చిన్న పోరున్ను ముగిసినతర్వాత, శాంతించి అమరినట్టి స్థానము కాబట్టి, దీనికి తణిగై (శాంతిపురి) అనుపేరు అమరినది. దేవతల భయము శాంతించిన చోటు; భక్తులయొక్క వంతలు, చింతలు, దరిద్రాదులు శాంతింపజేయు స్థలము; మునులయొక్క కామాద్యరిషడ్వర్గముల శాంతింపజేయు క్షేత్రము అగుటచేతను దీనికి "శాంతిపురి" అని పేరున్ను ఈ స్థలమునకు కలదు.

మఱియు "తణిగ" అను మాటకు మన్నించుట లేక ఓర్చుట యనియు ఒక అర్థము కలదు. అందుచే భక్తులయొక్క తప్పులను పాపము లను ఓర్చుకొని మన్నించి. కరుణజూపు స్థలముగాన, తిరుత్తణి అను అర్థముచేయుట పొసగును.

## తిరుత్తణి నగరము :

తిరుత్తణి ఒక చిన్న నగరమే ఐనను శ్రేష్ఠమైనది। నగర మధ్యమందే ఇనుపధారి అమరియున్నది. ఇచ్చట ఇనుపదారి ఉత్తర దక్షిణముగా నమరియున్నది. నగరమునకు ఉత్తరమున "నందియేఱు" అనునొక చిన్ననది యున్నది. తూర్పున కొన్ని ప్రభుత్వకార్యాలయములు ఉన్నవి. నగరమున ప్రభుత్వోన్నత పాఠశాలయున్నది. పడమట తిరుత్తణిలోనే శ్రీ సుబ్రహ్మణ్యస్వాములవారి ఆలయము ఉన్నది. ఈ నగరపు తూర్పు విభాగమునకు 'దిగువ తిరుత్తణి' అనియు, పడమటి విభాగమునకు 'ఎగువ తిరుత్తణి' అనియు పేర్లు. ఇనుపదారికి పశ్చిమమందు బజారు వీది యున్నది.

నగరమునకు ఉత్తరమున తిరుపతికిపోవు రహదారికి నైరుతిమున చోళింగపురమును, దక్షిణమున అరకోణము_కంచికిపోవు పోవు దారియు ఉన్నవి. చోళింగపురం రహదారికి ఉత్తరముగను ఇనుపదారికి పడమటగను ఒక చెఱువు కలదు. నగరమునంటి దక్షిణ పార్శ్వమున మంచినీటిగుంటయను తామరగుంట ఒకటి యున్నది. ఇందుండియే మొందీనగరమునకు నీటి సరపరా జరుగుచుండెను, ఐతే ప్రస్తుతము నీటతొట్టి కట్టబడి 'అరుంగుళము' అనుచోటు నుండి పంపులద్వారా ఆ తొట్టిని నిండించి, అందుండి నగరమంతటికిని నీటి సరపరా చేయబడుచున్నది. ఈ తిరుత్తణి నగరమే తిరుత్తణి తాలూకాకు ప్రధానపట్టణము; ఇవియే పంచాయతీ సమితియుకూడ, తిరుత్తణి మఠం గ్రామం, నల్లాగుంట, అమృతపురం, (ఎగువ తిరుత్తణి) అను ఊళ్ళున్నూ చుట్టుపట్లగల గ్రామపంచాయతీలును ఇందు చేరియున్నవి. ఈ పంచాయతి యూనియన్ నందు. ఇందలిజనాభా సుమారుము పైవియెదు వేలు. నగరమందు విద్యుత్తు సరపరా చేయబడియున్నది

తిరుత్తణిలో ఆయా తెగవారికి చెందినట్టి ప్రత్యేకించబడిన సత్రములు సుమారు 350 కలవు. కృత్తిక మొదలగు ముఖ్యమగు దినములలో సత్రములన్నియు జనసమ్మర్దము కలిగియుండును. పెళ్ళిళ్ళు, ఉపనయనములు. అన్నదానము మొదలగు కార్యములు ఈ సత్రములందు జరుపబడుచుండును. ఉత్సవాదులు లేనట్టి సందర్భములలో ప్రయాణీకులు, యాత్రీకులున్నూ బసచేయుటకు కావలసినంత

సలవపతి ధారాళముగ నుండును. శిలాపరివేష్టిత మగుటచే తిరుత్తణి కొంతవేడిమి (ఉష్ణోగ్రత) అధికముగనే ఉండును. ఐనను, చుట్టుపట్ల గ్రామస్థులు అమ్మకటచేత పాలు, పెరుగు, కూరకాయలు మొదలగు వస్తువులు ధారాళముగ లభించుటచే జనసమ్మర్ధము ఎక్కువగ నుండును ఇచ్చటగల కార్తికేయుని దేవాలయము యొక్క ప్రాముఖ్యతచేతనే ఈ నగరమునకు పలువిధముల గొప్పదనము కలిగించుచున్నది.

## తిరుత్తణి కొండ :

ఈ క్షేత్రమునగల కొండమీద శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వెలసి యున్నారు. ప్రత్యేకమగు శిఖరాగ్రమున గుడి తూర్పు ముఖముగ అమరియున్నది.

శ్రీవారు వెలసియున్న కొండకు ఇరుప్రక్కలందును పర్వత శ్రేణులు వ్యాపించియున్నవి. ఉత్తరమునగల పర్వతము కొంచెము తెల్లగనుండుటచేత దానికి 'బియ్యపుకొండ' అనిపేరు. దక్షిణమందు గల కొండ ఇంచుక నల్లగనుండుటచే దానికి 'గానుగపిండికొండ' అని పేరుగలదు.

రైలుమార్గ నిలయము (రైల్వేస్టేషన్) నుండి సుమారు 1 కి.మీ. దూరమున స్వామివారికొండ చరియ కలదు. ఈ చరియకు తూర్పున "శరవణ తీర్థము" లేక "కుమారతీర్థము" అను పెద్ద కోనేరుగలదు. యాత్రికులును, భక్తులును, బహుశః ఇందే స్నానమాడెదరు. ఈ తీర్థము చుట్టుపట్ల పలు మఠములు కలవు. కావున ఈ చోటునకు 'మఠం గ్రామము' అని పేరు. ఈకోనేటికి నైఋతి బాగమున స్వామివారి కొండ చరియ కలదు.

కోనేటికి తూర్పుగట్టున నిలిచి పశ్చిమాభిముఖముగ చూచినచో ఈ కొండవలయాకారముగ నుంచబడిన ఒక (మాల) దామము వలెను, మూడు ఆకారములను ధరించిన పరాత్పరుని వలెను, మూడుకొండలు కానవచ్చును. అయ్యది నేత్రపర్వముగ నుండును. అందుచేతనే 'అందమగు తిరుత్తణి కొండ' యని శ్రీ అరుణగిరినాధస్వామి తమ కీర్తనలలో శ్రీ స్వామివారి కొండనుగూర్చి కీర్తించియున్నారు. కార్తికేయునికి ఈడైన దైవము అన్యము ఒకటిలేనియట్లె తిరుత్తణికి సామ్యమైన క్షేత్రము వేరొండులేదు అనవచ్చును.

శ్రీ వెలయుటలోను — సిరియందమునను
వేవిధముల బుద్ధి విధ సమర్థతను
కరుణయందును తన్నొ కరు పొగడంగ
ముంగని నుపమించి — మొనసి చెప్పుదురు.

శ్రీవలే దేవితో — చెలంగి యాడు తల
మవు, పొగడ్తను గన్న - మహిమాన్వితమగు
చిరుతని పురమునె - చెప్పదు రుపమ
గరిమతో ముందుగా - కడమ చోటులకు.

(తమిళంలో - తణిగపురాణము)

## తిరుత్తణి గుడియొక్క పురాతన ప్రసిద్ధి :

తిరుత్తణి దేవాలయము చాలా పురాతన ప్రసిద్ధి పొందినది. శ్రీ సుబ్రహ్మణ్యస్వామియొక్క భక్తశిఖామణులలో అగ్రగణ్యులైన ప్రపుట దేవరాజు అను రాజుకాలమున నుండినవారగు శ్రీ అరుణగిరి నాధుడు 63 తిరుప్పుగళ్ పాటలు మూలముగా ఈ స్థలమును ఎక్కువగా పొగడియున్నారు. అందుచే 1600 సంవత్సరములకు ముందే ఈ స్థలమున్నూ దేవాలయమున్నూ ప్రఖ్యాతిగాంచి వెలసియుండెనని తెలియవచ్చుచున్నది.

అంతేకాక, నేటికి సుమారు 900 సంవత్సరములకు మునుపు మనుచుండిన కచ్చియప్ప శివాచార్యులు తమ స్కాందపురాణము నందు "పూవులలో తామరవలెను, నదులలో గంగను పోలియు, క్షేత్రములలో కాంచీ నగరమునకు సాటిగా, కొండలలో మేలై వెలయునది తిరుత్తణి కొండ" అనియు లోకమున కొండలు అనేకములుండియు శివుడు కైలాసమునే కోరుకొనినట్లు శ్రీ కార్తికేయుడు తిరుత్తణి కొండను ఎక్కువగ కోరుకొని అచ్చటనే సంతోషముగ నివాసము ఏర్పఱచుకొని విలసిల్లుచున్నాడు, అనియు, దీని శ్రేష్ఠత్వమును గూర్చి కీర్తించి యున్నాడు.

పూలలోన కమల — మొకటి మేలైనట్లు
చాలు నదుల గంగ —సరితు సాటి
తలములందు కాంచి - తలమున కీడుగా
నెలవులందు చిరుత - ణి యగుమేలు.

మందరమ్ము ఉండ - మ్రుమేరు వుండగ
శివుడు వెండి కొండ - జేరి నట్లు,
సుందరమగు కొండ - లందు నీ భువిలోన
ఇదియ కొండ నాకు - ఎంతో ముదము

(తమిళ స్కాందపురాణము)

పైగా, ఇచ్చట అపరాజిత వర్మ (క్రీ. వె. 875-893) అను రాజు శాసనమునందును, మొదటి పరాంతక చోళుడు (క్రీ.వె. 907-953) కాలపు శాసనమునను కనబడుటచే నేటికి 1200 సంవత్సరములకుముందు గానే ఈస్థలము పల్లవ చోళరాజులచేత కీర్తింపదగిన మహత్వమును కలిగియుండెనని చక్కగా బోదపడుచున్నది.

ఇప్పటికి 1300 సంవత్సరములకు పూర్వము జీవించుచుండిన తిరునావుక్కరసర్ అను భక్తశిఖామణి తనయొక్క "తిరుత్తొండగం" అను కీర్తనలలో "రాలుందు చెంగల్వా-రాయనిగట్టు" అని తిరుత్తణిని గురించి సూచించియున్నారు. దేవేంద్రుడు ఇచట సుబ్రహ్మణ్యస్వామిని నీలోత్పలమను చెంగల్వపూలతో అర్చించినట్లుగా స్థలపురాణము కలదు. అందుచేతనే దీనిని ఆయన వేయివిధముగ పొగడియున్నాడు. ఇందుచే సుమారు 1500 సంవత్సరములకు పూర్వమే అనగా తిరునావుక్కరసర్ నకు ముందుకాలమందే తిరుత్తణి ప్రసిద్దమగు కీర్తిగాంచిన గొప్పపుణ్య క్షేత్రముగా విలసిల్లుచుండెడిది. అను యదార్థము చక్కగా తెలియు చున్నది.

## ఈ స్థలముయొక్క మహాత్మ్యము :

తమిళనాటగల ప్రజలు ఎక్కువగా ఆశించి కొలుచునట్టి దేవుడు శ్రీకార్తికేయుడను మురుగప్పెరుమాళ్ళు, కలియుగమున ప్రత్యక్షదైవమని ప్రసిద్ధిచెంది, భక్తులందరికిని శ్రీస్వామివారు తన కరుణను ప్రసాదించి పాలించుచున్నారు. 'మురుగా' అనగానే తమిళుల మనసంతయు ద్రవించును. శ్రీవారియెడ వారికి అపారమగు భక్తియు, ప్రేమయు కలవు.

శ్రీ స్కంధు (కార్తికేయునకు ముఖ్యమైన రోజులగు కృత్తిక, షష్ఠి, విశాఖ మొదలగు దినములలో వ్రతముపూని లక్షోపలక్షలాదిగ జనులు శ్రీవారిని సేవించుచుందురు. వీరియొక్క ఆలయములన్నియు ప్రార్థనాస్థలములగు దివ్యస్థలములుగా నెంచబడుచున్నవి. ప్రాచీన కాలమందుండియు, కార్తికేయుని తమిళులు భక్తిపూర్వకముగ సేవించి కీర్తించి వచ్చుచున్నారు. ఇప్పటికి సుమారు 5000 సంవత్సరములకు పూర్వము ఉండినట్టి "తొల్కాప్పియం" అను తమిళ గ్రంథమునందు శ్రీ సుబ్రహ్మణ్యుని గురించి వ్రాయబడియున్నది.

మఱియు, సంఘకాలపు (సుమారు 2000 సంవత్సరములకు పూర్వము) కవిగానుండిన "నక్కీరుడు" అను తమిళ వాగ్గేయకారకుడు శ్రీ స్వామివారిని గురించి "తిరుమురుగార్రుప్పడై" అను శ్రేష్ఠమైన స్తోత్రగ్రంథమును వ్రాసియున్నాడు. అందులో తిరుప్పరంకుంద్రం, తిరుచ్చీరలైవాయ్, తిరువావినన్‌కుడి, తిరువేరగం కుంద్రుదోరాడల్ పళముదిర్సోలై అను ఆఱుస్థలములను శ్రీమురుగని (సుబ్రహ్మణ్యుని) "ఆఱుపడైవీడు" లని శ్రేష్ఠములుగా చెప్పబడుచున్నవి. వీనిలో కుంద్రుదోరాడల్ అనునది శ్రీ సుబ్రహ్మణ్యుడు వేంచేసియున్న కొండల నన్నింటిని గుఱుతించునవెయైనను తిరుత్తణినే ప్రత్యేకించి రెండవదిగా గుఱుతించబడియున్నదని విద్వాంసుల అభిప్రాయము.

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి తన క్రియాశక్తియగు దేవసేనను తిరుప్పరంకుంద్రంలో పెళ్ళాడినట్లు. తిరుత్తణిలో తన ఇచ్ఛాశక్తియగు వల్లీదేవిని పెళ్ళాడి సంతసించి మాధుర్యముగా వెలసి కరుణపాలించుచున్నాడు. తిరుత్తణియొక్క గొప్పతనమునకు ఇదియే ముఖ్యకారణము అగును. పాంబన్ శ్రీ కుమారగురుపరస్వామి, వడలూరు రామలింగ స్వామి, కందప్పయ్యదేశికర్, కచ్చియప్పమునీశ్వరుడు, కచ్చియప్ప శివాచార్యుడు, అరుణగిరినాధుడు మొదలగు గొప్పగొప్ప భక్తశిఖామణులు ఎల్లరును తిరుత్తణి కుమారస్వామినే ఎక్కువగ విశేషించి కీర్తించి యున్నారు.

పలులక్షోపలక్షలకొలది జనులు తిరుత్తణి సుబ్రహ్మణ్యుని తమకు కులదైవముగాగొని సేవించి ఎన్నోమేళ్ళుపొంది వచ్చుచున్నారు.



కొండకు పోవు బస్సుదారిలో ప్రాకారము (ఘాట్ బాట్)

అడి (ఆషాడ) కృత్తిక తై (పౌష్య) కృత్తిక మాశి (మాఘమాస) కృత్తిక మున్నగు విశేషదినములలో అనేక లక్షదిజనులు పూలకావళ్ళు పాలకావళ్ళు మొదలుగాల ప్రార్థనలను ఇచ్చట స్వామివారికి చెల్లించు కొందరు ప్రతి సంవత్సరమందును డిసంబరు నెల 31 వ తారీకు జనవరి ఒకటో తారీఖునాడు ఇచ్చట స్వామిభక్తులు తండోపతండములు గుమికూడి భజనలు సలిపి స్వామిదర్శనము చేసికొనిపోవుచుందురు.

తిరుప్పుగళ్ వల్లించ — నెంచువారదు గూడు

తిరుతణి వాసియా — పెరుమాళ్ళ

అని అరుణగిరినాథుడు కీర్తించియుండునందుకు తగినట్లు వందలకొలది తిరుప్పుగళ్ సభవారు, తిరుప్పుగళ్ పాటలు పాడుచు, స్వామివారి నామకీర్తనలు చేయుచరాగా, పలులక్షలకొలది జనులు కొండమిదికెక్కి స్వామిని దర్శించి ఆనందించుచుండు వేడుక భక్తి విహీనులైనవారికి సైతము భక్తి కలిగించునదిగ పొడసూపును; వారును స్వామియొక్క అనుగ్రహముచే అనేక మేళ్ళను పొందియుండుట గ్రహించియే ఉందురు. అటులు సుబ్రహ్మణ్యస్వామి అనుగ్రహముచే వ్యాధులు తీరినవారు మనోవ్యధలు తీరినవారు, అనేకములగు కోరికలు ఈడేరినవియు, శ్రీస్వామివారి అనుగ్రహము నిజమూగా కలిగియుండు టచేతనే, దేశమందు నలుమూలలనుండియు, ప్రతిదినము వేలకొలది జనులు ఈ దేవాలయమునకువచ్చి సుబ్రహ్మమణ్యని దర్శించి సంతోషముగ పోవుచుందురు. తమిళనాటగల వేలకొలది క్షేత్రములలో మిక్కిలి కీర్తిపొంది, ప్రఖ్యాతినొందియున్న దేవాలయములందు తిరుత్తణి తలమానికముగ విరాజిల్లుచు, దినదిన ప్రవర్ధమానమగు చున్నది.

## క్షేత్రగ్రంధములు :

తిరుత్తణియొక్క శ్రేష్టత్వమును పొగడి కచ్చియప్పశివాచార్యుల వారు తమచే విరచితమైన స్కాంధపురాణమునందును, కందప్పదేశికులు తమ తణికాచల పురాణమునందును గొప్పగా కీర్తించియున్నారు. అరుణగిరినాథులు ఈ స్థలమును 63 కీర్తనలతో పొగడి పాడియున్నారు

వడలూరు రామలింగస్వామివారు తమయొక్క "తిరుఅరుట్పా" అను గ్రంధములో పంచమ సర్గమందు తిరుత్తణిని గురించియు పలు వృత్తములను రచించియున్నారు కందప్పదేశికులు తమయొక్క తిరుత్తణిగై సన్నిధి సర్గమందు పిళ్ళైత్తమిళ్ కలంబగం ఉలా. (**பிள்ளைத்தமிழ் கலம்பகம் உலா**) అనుభూతి మొదలగు పలు ప్రబంధములు పాడియున్నారు 17 వ శతాబ్దమునందుండిన వాగ్గేయ కారకుడు అగు శ్రీ ముత్తుస్వామిదీక్షితులవారు ఇట శరవణ తీర్థమున స్నాతులైవచ్చినతోడనే ఆయనకు స్వామివారు ప్రత్యక్షమై వారినోట పటికబెల్లమును వేసి తనపై కీర్తనలపాడమని ఆజ్ఞాపించినదే తడవుగా దీక్షితులు స్వామివారిపై కీర్తనలు రచించ ధన్యులైరి. తణిగైయార్టుప్పడై (**தணிகையாற்றுப்படை**) తణిగైపదిర్టుప్పత్తందాది (**தணிகைப் பதிற்றுப்பத்தந்தாதி**) యనియు. కచ్చియప్ప మౌనిచేత రచింపబడియున్నది, అరుణగిరినాధుని కందరలంగారం (**கந்தரலங்காரம்**) కందరందాది (**கந்தரந்தாதி**) తిరువగుప్పు (**திருவகுப்பு**) మొదలగు గ్రంధములందును తిరుత్తణియొక్క మహిమను పొగడియున్నారు.

## సేవించిన మహనీయులు :

శివుడు:— తిరుత్తణిలో సుబ్రహ్మణ్యుని ధ్యానించి ఈశ్వరుడు ప్రణవమంత్రోపదేశమును స్వామివారినుండి పొందెను బాలుడయిన సుబ్రహ్మణ్యుడు ప్రణవార్థమును వివరించిన సామర్థ్యమును కని "సంతసం చెయ్యుమేన్సంతు దాన్నిమురు; సంతసం-బందువీ న్సంతు వల్కవిని"—అనెడి తిరువళ్ళువరు వాక్యానుసారముగ తండ్రియగు పరమేశ్వరుడు బిగ్గరగా ధ్వనించి, అట్టహాసముచేసి నవ్వి సంతసించెనట అందుచే నిట ఈశ్వరునకు వీరాట్టహాస్యేశ్వరుడని పేరు. కలిగినది (మందహాసము చిరునవ్వు; అట్టహాసము బిగ్గరగాశబ్దించు పెద్దనవ్వు) పరమేశ్వరుడు ప్రణవోపదేశము నొంది వీరాట్టహాసముజేసి వెలసినగుడి ఈయూరికి ఈశాన్యమునందు నందియేటి ఉత్తరపు గటున నున్నది. ఆగుడికి వీరాట్టహాసమనియు. మరియు. వీరాట్టహాసేశ్వర ఆలయము

పిలువబడుచున్నది. అది తప్పు. వీరాట్టాసం అనుట శివుడు చేసిన వీరకృత్యములను గుర్తించగల వీరట్టహాస క్షేత్రాష్టకము అనెడి ఎనిమిది దేవాలయములనే చక్కగ సూచించునవిగ నున్నవి. పరమేశ్వరునకు ఓంకారోపదేశము చేసిన స్థలము వీరాట్టహాసేశ్వరుగుడికి ఎదురుగ నందియేటి దక్షిణపు గట్టున. ఆఱుముగస్వామి దేవాలయమను పేర పిలువబడుచున్నది. ఇచటగల అఱుముగస్వామివారే కొండపైగల ఉత్సవమూర్తియని కర్ణపరంపరగా అనుకొనుట తెలియుచున్నది.

మహావిష్ణువు : తిరుత్తణిలో స్వామిని సేవించి తారకాసురునిచే హరించబడిన తనయొక్క చక్రము, శంఖము మొదలగు వానిని విష్ణువు తిరుగపొందెను. ఆయన కల్పించిన "విష్ణుతీర్థము" కొండ మీద దేవాలయమునకు పశ్చిమభాగమునందు ఉన్నది.

రామభద్రుడు : ఇచ్చట స్వామివారిని సేవించి. రావణుని జయించగల అస్త్రాదులను పొందుటతోబాటు. రావణుని జయించి తిరిగి వచ్చుసమయమున మరల కుమారస్వామిని సేవించి శివజ్ఞానమును పొందెను. రావణుని చంపి విజయముపొంది వచ్చినందుచేత ఇచట గల రామునికి "విజయరాఘవపెరుమాళ్ళు" అనుపేర వెలసియున్నారు. విజయవల్లిసమేతడగు శ్రీవిజయరాఘవపెరుమాళ్ళుగుడి ఆఱుముగస్వామి గుడికి చేరువనున్నది; అనగా, ఒకే ఆవరణమునందు ఆఱుముగస్వామి గుడికి దక్షిణమునందున్నది.

బ్రహ్మదేవుడు : తిరుత్తణిలో బ్రహ్మదేవుడు సుబ్రహ్మణ్యుని సేవించి సృష్టిసామర్థ్యమును పొందెను. మఱియు శూరపద్ముడను రక్కసునిచే అపహరించబడిన తమ సంపదలను స్వామియొక్క దయచే మరల పొందగలిగెను. చదువుల తల్లియగు సరస్వతీదేవియు ఇచట సుబ్రహ్మణ్యస్వామిని సేవించినది. తూర్పున కొండచఱియ నుండి కొండనెక్కిపోవు మార్గమధ్యమున సగము దూరములో కొండ మెట్లకు సమీపముననే ఉత్తర దిశలో బ్రహ్మదేవుడు కల్పించిన బ్రహ్మతీర్థము ఉన్నది. ఇది "బ్రమ్మదొన" యని వాడబడుచున్నది. దీనికి దక్షిణమున "బ్రహ్మదేవాలయ"మున్నది.

ఇటుల, ఈ స్థలమున ఈశ్వరుడు, విష్ణువు బ్రహ్మదేవుడు అని ముగ్గురు మూర్తులును సేవించి తరించిన చరిత్ర సంఘటనను

చలిమలసుత నాథు — ఉల వాణినాథు
డెలిమి లచ్చిమగడు — గొలిచెడి వేల।

అని అరుణగిరినాథుడు తన "తిరుప్పుగ"ళను కీర్తనలలో (261) ప్రశంసించి కీర్తించియున్నాడు.

ఇంద్రుడు: దేవలోకమునుండి శూరపద్మునిచే అపహరించబడిన శంఖనిధి, కామధేనువు చింతామణి, కల్పతరువు మున్నగు సంపదలను క్రమ్మరపొందగోరి, ఇంద్రుడు ఇచట సుబ్రహ్మణ్యస్వామివారిని పూజించి కొలిచెను. తిరుత్తణికి దక్షిణదిశనున్న ఒకదొనలో నీలోత్పల వల్లులను నాటించి, వానిని పెంచి అందుపూచిన పూలచేత ఉదయ మధ్యాహ్న సాయం సమయములందు త్రికాలపూజలను శ్రీవారికి ఇంద్రుడు జేయుచువచ్చెను. అపుడు తన తపము నిర్విఘ్నముగ కొనిసాగుటకై తొలుతనొక వినాయక ప్రతిష్ఠజేసిన వినాయకునకు "చెంగల్వ వినాయకుడు" అనిపేరు. అతనిచె ఏర్పాటుజేయబడిన నీలోత్పలదొనకు "ఇంద్రనీలోత్పలదొన" యనెడి పేరుతో ఒక పుణ్య తీర్థముగా స్వామివారిదేవాలయమునకు దాక్షిణద్వారమునకు ఎదురుగ నున్నది. దీనినే కల్లారతీర్థ —"కల్లారతీర్థము" అని వ్యవహరించబడు చున్నది. ఈతీర్థములోని నీటితోనే నేటికిని స్వామివారి అభిషేకమునకు పాకశాలకు, పూజలకును ప్రత్యేకించి శ్రేష్ఠమైనదిగ పరిగణించబడు చున్నది. అందుచే ఈ తీర్థమును దూరము నుండియే ముట్టుకొనవలెను కాని, అన్యథా ఉపయోగించకాదు. ఇంద్రునితోసహా దేవాదులందఱు వచ్చి స్వామిని సేవించినదానిని గూర్చి

'దివిజులు కొలిచిన - తిరుతణి పొన్పదం' (303) అనియు
'దేవత మెచ్చిన - తిరుతణి క్షేత్రము' (311) అన్నియును

తిరుప్పుగళ్ కీర్తనలలో అరుణగిరినాథుడు పొగడియాడుట అందఱికిని తెలిసినదే.

నందీశ్వరుడు : పతి, పశు, పాశము అనియును ఈశ్వరుడు జీవుడు పాశము అనియు త్రిపుటిని గూర్చి బోధించు శైవసిద్ధాంచె దర్శనములనుగూర్చి ఇచ్చట సుబ్రహ్మణ్యస్వామివారిని కొలుచుటత

నందీశ్వరునకు ఏఱుకపఱచబడెను. అతనికొఱకు శ్రీ సుబ్రహ్మణ్య స్వామి రావించిన 'శివతత్త్వామృతము' అను ఏఱుఇపుడు 'నందియేఱు' అనబడుచున్నది. శ్రీవారి కరుణ అనుగ్రహములు కలిగిన గుహ 'నందిగుహ' అని వ్యవహరించబడుచున్నది.

## వాసుసర్పము:-

దేవతలు పాలసముద్రమును మదించినపుడు మంధర పర్వతమును కవ్వముగను, వాసుకి అను పామును త్రాడుగను చేకొని చిలికిరి. అట్లు చిలికినపుడు వాసుకిశరీరమునందు పలుగాయములు, వ్రణము లుకలిగి. అందువలన చాలబాధపడెను. అతడు ఒక దొనలో ప్రతిరోజూ స్నానముచేసి, షణ్ముఖస్వామిని సేవించినందుచేత ఆ బాధలు తొలగిపోయెను. వాసుకి స్నానమాడినదొన .వాసుకిదొన' అను పేరుగాంచినది.

ఆదిశేషుడును అట్లే సేవించి స్వామివారి అనుగ్రహము పొందెను. .ఆదిశేష తీర్థము ' విష్ణుతీర్థమునకు పశ్చిమమున కొండ మెట్లదారికి దక్షిణమున ఉన్నది.

## అగస్త్యమహాముని:-

వీరు ఇచట స్వామివారిని కొలిచి తమిళత్రయ పాండిత్యమును పొంది. శివజ్ఞానబోదయును పొందెను. ఆయన నిర్మించిన 'అగస్త్య తీర్థము' ఆదిశేషతీర్థమునకు ఆగ్నేయముననున్నది.

## నారదముని:-

నారదమునీశ్వరుడు భక్తిజ్ఞానములందు మిన్నయైయున్నను ఆయనకున్ను పలు సంశయములుకలిగెను. తన సందేహములుతీరి జ్ఞానము బోధపడుటకొఱకు నారదుడు ఇచట స్వామివారినిసేవించి వారి అనుగ్రహము పొందెను. ఆయన ఏర్పఱచిన తీర్థము 'నారదతీర్థము' ఇది అగస్త్యతీర్థమునకు తూర్పునందు ఉన్నది.

## సప్తఋషులు:-

సప్తర్షులు అనబడు వశిష్టాదులగు ఏడుగురు ఋషులున్ను ఇచట సుబ్రహ్మణ్యస్వామివారిని పూజించిరి. వారు పూజించినచోటు

కొండయొక్క ఆగ్నేయమున అమరియున్నది. వారు ఏర్పఱచిన ఏడు దొనలున్ను, కన్యకల గుడియున్న ఇచ్చట కలవు. ఈ స్థలమును 'ఏడు దొన'లనియు, 'కన్నికలగుడి' అనియు వ్యవహరించబడుచున్నది. దట్టమగు వనములతో నిబిడమై పచ్చదనముతోను, చల్లదనముతోను గూడినదై ఎండ పోకనిదై ప్రశాంతమగు చోటుగా అలరారు ఈస్థలము తపమునకు ధ్యానమునకు ఎంతయు తగినదిగా ఉన్నది.

తాపను లున్మనిగణా - ద్దగమదయుత పుష్ప
మపచయకబును చేసి - యర్చించు తిరుతణి - (266)

అని అరుణగిరినాథుడు తన కీర్తనలలో సప్తర్షులు పూజించుటను గూర్చి కీర్తించియున్నారు.

## కుమారదేవుడు:-

కుమారస్వామియను శ్రీ సుబ్రహ్మణ్యస్వామియే ఇచట తన తండ్రియగు పరమేశ్వరుని పూజించతలచెను. అందుచే తిరుత్తణి కొండపై తన నివాసమునకు ఈశాన్యభాగమున ఆపత్సహాయ వినాయకుడను గణేశుని స్థాపించి మొట్టమొదట పూజించుకొని తర్వాత శివలింగ ప్రతిష్టచేసి వరుసగా సేవించెను. అప్పుడు శివుడు అతనికి అనుగ్రహించి "జ్ఞానశక్తి" అను కుంతమును (ఈటె) ఇచ్చెను. అందుచే ఇచ్చటగల స్వామివారికి "జ్ఞాన శక్తిధరుడు" అని పేరు వచ్చినది. ఇచ్చట శివలింగమునకు "కుమారేశ్వరుడు" అనిపేరుకలదు కుమారలింగేశ్వర సన్నిధి రెండవ ప్రాకారమందు ఉత్తరమున అమరియున్నది. కుమారేశ్వరుడు శివునకు అభిషేకము చేయుటకు తెచ్చినట్టి తీర్థమే "కుమారతీర్థము" లేక "శరవణతీర్థము" అగును. అదియే కొండ చరియయందుగల కోనేరు. సుమారు 200 సంవత్సరములకు ముందుండిన కశ్యప మునీశ్వరుని కాలమునందుకూడ ఈకోనేరుమిక్కిలి శ్రేష్టముగా పొగడియుండుట ప్రమాణమగును.

ఎన్ని పంతలనైన - నన్నిటిం బోకార్చు
చెన్నగు శరహణ - చెఱువున నీరాడు -

అని వారుకూడ కీర్తించియుండుటను "తణిగైయార్టుప్పడై" అను భక్తి గీతములలో శరవణప్పొయ్గై అను కుమారతీర్థమును గూర్చి

కీర్తించియున్నారు,

## సేవించు విదానము

చెరుతనికి పోవు భక్తజనులు కొండ క్రిందనుండు కుమార తీర్థమున స్నానమాడి పరిశుద్ధులై పొడి (మడుగు) వస్త్రములను ధరించి విభూతి రుద్రాక్షలు మొదలగు శివ చిహ్నము లను ధరించి భక్తితో కొండను ఎక్కవలయును. అట్లుమెట్లెక్కిపోవునపుడు తమకు వీలునుబట్టి తిరుప్పుగళ్ కీరనలను రాగయుక్తముగ పాడుచు పోవలయును. కొండమీదికిపోయి తర్వాత తూర్పు ప్రాకారమునగల ధ్వజస్థంభ వినాయకుని మఱియు ఐరావతమును దర్శించుకొని పిమ్మట దక్షిణప్రాంతమునగల ఇంద్రనీల దొనను దర్శించుకొని. అటుపై ఆలయమును ప్రవేశించి ఆపత్సహాయ వినాయకుని చేయునున్న వీరబహు మొదలగు నవవీరులను కుమారలింగేశ్వరుని దర్శించి తరువాత మూలస్థానమునగల జ్ఞానశక్తిధరుడను సుబ్రహ్మణ్యస్వామిని దేవసేన వళ్ళియమ్మవార్లను సేవించవలయును సన్నిధిలోగల సమస్త దేవ విగ్రహములను దర్శించి సేవించుకొనవలయును. శ్రీవారి సన్నిధిలో విభూతి కుంకుమ ప్రసాదములను ఇచ్చుటేగాక, ఇచ్చట "శ్రీవారి మెయిపూత" యను గ్రంధముకూడ ఇవ్వబడును. తణికాచల కుమార స్వామి విగ్రహమును చక్కగా గమనించి చూచినచో ఱొమ్మునందు కొంత పల్లముగా కనబడును. తారకాసురుడు విష్ణువద్దనుండి అపహరించిన "సుదర్శన"మను చక్రమును, కుమారస్వామి వానిని జయించి నపుడు, తాను దానిని వెన్నునకు తర్వాత ఇచ్చుటకుగాను కొంత కాలమువఱకు తన వక్షమున నుంచుకొనెను. అది గుఱుతుగా తణికాచల సుబ్రహ్మణ్యుని ఱొమ్మునందు కొంతపల్లము ఏర్పడినది. దానిపైనుంచు చందనమే భక్తులకు అనుగ్రహ చిహ్నముగ యివ్వబడుచున్నది. ఇదియె శ్రీవారి మెయిపూత లేక శ్రీపాదరేణువు అనబడును. ఈ చందనము స్వీకరించు భక్తజనుల వ్యాధులు బాగుఅగుచున్నది.

తారకుంతు విడగ - తనదుర మందిడి
కొన్నట్టి చక్రము - వెన్నుకొపగ
బడిననాటి మొదలు - బహు కీర్త నొందిన
చిరుతణి మలవాసు - చిద్విలాసు

నురమునందున వడ్డ - తిరువడియాలంబు
స్ఫురిత మగుచునుండు - భువిని ప్రేక్ష
కులకు దానిని గనుఁ - గొని నతి జేసెడి
భక్తవరులయొక్క - బాధలెల్ల
పోయి మానసిక - పిడుమ లన్నియు బాసి
భక్తి మిగుల గలిగి - పరమపదము
నందు చందు రనుట - యతిశయోక్తియె కాదు
మౌను జను లెఱుంగు - మంతన మిది.

(తణికాచల పురాణము - కందప్పదేశికర్)

## శిలాశాసనములు

తిరుత్తలో కొండపై కుమారస్వామి దేవాలయమును, నందియేటి గట్టున వీరాట్టహాసేశ్వరుని ఆలయము, ఆఱుముగస్వామి ఆలయము విజయరాఘవస్వామి ఆలయములను కలవు. వీనిలో రాజకేసరివర్మ యను మొదటి రాజరాజదేవుడు (క్రీ. వె. 985—1014), పరకేసరివర్మ యను రాజేంద్రదేవుడు (క్రీ. వె. 1118—1133) ను, మదురగొన్న కొప్పర కేసరివర్మ (క్రీ.వె. 907—955) విజయాపరాజిత విక్రమవర్మ (క్రీ. వె. 875—893), వీరకంపణ ఉడయారు, (శకము 1288) వీరప్రతాప సదాశివదేవరాయడు (శకము 1471) అను రాజులయొక్క శిలాశాసనములు కానబడుచున్నవి. 1905 వ సంవత్సరములో పురావస్తు పరిశోధక శాఖవారు ఈ శాసనములను పరిశోధించి యున్నారు. తిరువేంగడమున ఎగువ తిరుపతికి పోవువారు పోయి తిరిగివచ్చువారును అగు యాత్రికుల కొఱకు ఇచ్చట భోజనము పెట్టుటకై భూదానము తీయబడియున్నది. వీరాట్టహాసేశ్వరుని దేవాలయమును నంబియప్ప అనునతడు కట్టించెనమటకు

అందమౌ చెరుతని - యందీశునకు నొక్క
నల్లరాతి గుడిని - నట్టె నిర్మి-
తంబు జేయగోరి - తగశిల్ప శాస్త్రజ్ఞు
డైన నంబియప్ప - యమర జేసె.

అనెడి శిలాశాసనములోని పద్యము తెలుపుచున్నది. ఈ పద్యమును పెరుమానడిగళ్ అనుపేరదాల్చిన అపరాజితవర్మ (పల్లవుడు క్రీ. శ. 875—893) చెప్పెనని తెలియుచున్నది. ఇందుమూలమున వీరాట్టహాసేశ్వరునిగుడి వేయి సంవత్సరములకు ముందు ఉండినదని తెలియవచ్చుచున్నది. తిరుత్తణి కొండపైగల గుడి "విజయంకొండ చోళమండలత్తు మేల్మైనాట్టు తిరుత్తణియిల్" అనియు, అది, తున్నవర్ధన కోట్టము నకు చెందినట్లుగను. ఈశాసనముల మూలముగను ఎఱుగుచున్నాము. గుడిలో దివ్వె వెలిగించుటకు ఒకరు 12 మేకలను దానము చేసెను. మఱియొకడు 30 పశువుల నిచ్చియున్నాడు. ఇంకొకడు 90 మేకల నిచ్చియున్నాడు. స్వామివారిగుడికి భూదానమొసగిన నంబియప్పనంబి అనునతడు వీరాట్టహాసేశ్వరునికి 1000 గుంటల నేలను దానముచేసియున్నాడు అనెడి సమాచారములు ఈ శాసనముల మూలమీరుగ తెలియబడుచున్నది.

## గుడియొక్క ఉనికి

కొండ క్రిందిభాగమునుండి గుడికిపోవుటకు 365 మెట్లు ఉన్నవి ఈ మెట్లు ఒక సంవత్సరముయొక్క 365 రోజులను గుఱుతించు చున్నవి. మెట్ల కొలతలు రమారమిగ ఉండుటచేత ఎక్కుటకు ఆయాసముగ ఉండదు. తిరుప్పుగళ్ కీర్తనలు పాడుచు కొండెక్కి పోయినచో మనకర్మలు సౌలభ్యముగా తీరిపోవుటేగాక కొండెక్కుట యును సులభముగ ఉండును. సగముదూరము లో కుడివైపుననొక దొనయున్నది. అది బ్రహ్మదొన యనబడును. దానిని దర్శించి, అచటగల వినాయకుడు, బ్రహ్మలింగేశ్వరుడు ఇద్దఱిని దర్శించి కొండ శిఖరమునకు పోవలెను.

కొండమీదికిపోయిన వెంటనే తేరువీధియగు మొదటి ప్రాకారము స్వామివారి సన్నిధికి ఎట్టయెదుట కర్పూరమండపము ఉన్నది. కృత్తిక మొదలైన విశేషదినములలో లెక్కకు మిక్కుటముగు ప్రార్థనాకర్పూర ములు ఇందు వెలిగించబడు చుండును. గుడియొక్క చుటుకొలత సుమారు 1000 అడుగులు. తేరువీధికి ప్రదక్షిణముగ వచ్చినచో, దక్షిణ ద్వారమునకు ఎదురుగ దక్షిణమున ఇంద్రనీల తీర్థము అగుపడును

దీని తీర్థమే ఇప్పటికిని సుబ్రహ్మణ్యస్వామివారికి శ్రేష్ఠముగ ఉపయోగ పడుచున్నది. ఇందు ఎవరును దిగి స్నానము చేయరాదు. నిలిచినచోటులోగ దీనిని దర్శించుకొని పోయిన నైఋతిమూలలో వివాహ మంటపము ఉన్నది. ఉత్సవకాలములలో స్వామివారి మంటపమునకు వేంచేయును ఇచటనుండియే స్వామివారు వాహనమెక్కి ప్రాకారమేగుట, ఊరేగుటలు జరుగుచున్నవి.

తర్వాత పడమటి ప్రాకారమున ఎగువ తిరుత్తణికిపోవు కొండ మెట్లు ఉన్నవి. చెంగల్వ వినాయక ఆలయమును అచటనే కలదు. పశ్చిమ ప్రాకారాంతమున చెన్నపురి హేగ్గాఅండ్ కో వారిచే నిర్మితమైన ధర్మ మంటపము కలదు. ఉత్తము తూర్పు తేరువీధినుండి చూచినచో నందియేలు, తిరుత్తణి పట్టణము మున్నగు అందమైన దృశ్యములు కనబడును చూడవచ్చును. ఉత్తర ప్రాకార అంత్యమున ఈశాన్యమందు నవాబు వాద్యమండపము కలదు. ఇచట ప్రతిరోజూ, మఱియు ఉత్సవ కాలములోను మహమ్మదీయులు వాద్యము వాయింతురు. హిందూ ముస్లిం దిక్సతకు ఇదియొక్క మరచిగుఱుతుగా ఉన్నది తేరువీది ప్రాకారమునుండి తూర్పు ద్వారముననో పశ్చిమ ద్వారమునందో కొన్ని మెట్లు ఎక్కినచో శ్రీవారి సన్నిధి చేరవచ్చును.

## మొదటి ప్రాకారము

తూర్పు ప్రాకారమునకు బయట ఉత్తరభాగమునందుగల వినాయకుని మ్రొక్కి లోనిబయటి ప్రాకారమును చేరవచ్చును. ఈ ప్రాకారమందే ప్రార్థనాపరులు కృత్తికరోజులలో అంగప్రదక్షిణము చేయుట వాడుక. ఈ ప్రాకారము ప్రదక్షిణముచేసి వచ్చినపుడు నైరుతి మూలలో ఉమామహేశ్వరుని సన్నిధి యున్నది. ఇందుకుచేరువ ఉత్తర మున సప్త వాద్యమండపమున్నది. విశేష సమయములందు ఇటనుండు సప్తవాద్యములను స్వామివారియెదుట వాయింతురు. పడమటి ప్రాకార మధ్యమున పశ్చిమద్వారమునకు దక్షిణముగ ఉచ్చిపిళ్ళారి సన్నిధి ఉన్నది తూర్పుప్రాకారమున ఉండు ధ్వజస్తంభ వినాయకుని ఐరావతమును దర్శించి లోపలికి పోవలయును.

ఐరావతము స్వామివారికి ఎదురుగ నిలువక తూర్పుదిశ తిరిగి యున్నది. ఇందుకు కారణము ఇంద్రుని వాహనమగు ఆవెల్లేనుగు దేవసేన అమ్మవారి వివాహ సమయమున అరణముగ (శ్రీధనముగ) ఇంద్రునిచే నీయబడినది. ఐరావతము తన్నువిడిచిపోగానే ఇంద్రుని ఐశర్యము తగ్గెను, ఆకొఅతపోకాత్సుకొనుటకు ఇంద్రుడు స్వామివారిని ఇచట చెంగల్వపూవులతో అర్చించెను. ఆపూజలకు మెచ్చి, ఐరావతమును మరల దేవలోకమునకే తీసికొనిపోవుటకు స్వామివారు అనుమతించెను. ఐనను అరణముగా ఇచ్చిన సొమ్మును మరలపుచ్చుకొనరాదనియు. అదిపాడికాదనియు, ఇంద్రుడు సంశయించెను. ఐరావతము సైతము షణ్ముఖుని వాహనముగ ఉండుటకే ఎక్కుగ ఆశపడెను, అపుడు ఇంద్రుడు ఐరావతమును తనలోకమునకు అభిముఖముగా అంగా తూర్పుదిశ చూచుచు-నిలిచియుండిన చాలుననియు తనరాజ్యము, ఐశ్వర్యాదులు నిలిచియుండగలననియు విన్నవించెను. స్వామి అట్లే అనుగ్రహించెను. అందుచేతనే ఐరావతము ఎల్లప్పుడు తూర్పుముఖముగ నిలచి, స్వామివారు తనపై ఆరోహించి ఏగుటకు ఎల్లపుడును సిద్ధముగా నుంతునట్లును తోచుచున్నది. ఈ వెల్లఏనుగును దర్శించుకొన్నమీదనే లోపలికి ప్రవేశించవలెను.

అట్లు లోనికి పోవునపుడు సన్నిధి ద్వారమునకు దక్షిణమున "ప్రశన్నకాదరేశ్వరుడు" అను శివసన్నిధి కలదు. తనకుకలిగిన ఆపదను పోగొట్టి పాలించిన కారణముచే. "కాదర్" అను పేరుగల ఒక నవాబు ఈలింగమునిట ప్రతిష్ఠించి మీదచెప్పిన నవాబు మంటపమునుకూడ నిర్మించి. పూజాసమయములందు వాద్యఘోషముఘ్రమోయించు ఏర్పాటు చేయించెనని తెలియుచున్నది. (అందుచే నేటికిని మహమ్మదీయులే ఈ వాద్యఘోషమును చేయుచుందురు).

## రెండవ ప్రాకారము

ఈ ప్రాకారమును చుట్టివచ్చిన ఆగ్నేయమున మడప్పళి (పాకశాల) యు. దక్షిణప్రాకారమధ్యమునకామాక్షీసహిత ఏకామ్రనాథ సన్నిధియు ఉన్నవి. పశ్చిమ ప్రాకారమధ్యమున షణ్ముఖస్వామివారి మూలవర్ల సన్నిధిడన్నది. వాయవ్యమున ఆఱుముగస్వామివారి అభిషేక

మండపము ఉన్నది. ఈ మండపమున చిన్న ఉత్సవమూర్తి సన్నిధి ఉన్నది. ఉత్తరద్వారమందు ఉత్తరభాగమధ్యలో ఒకస్తంభము, చెంతనుండి దక్షిణమునకు ప్రాలి ఒకద్వారముగుండా చూచినచో మూల స్థానపు విమానము కనబడును.

ఈ ప్రాకారమున కుమారలింగేశ్వర సన్నిధియున్నది. దీనిక్రింది ప్రక్క ఎల్లలో యాగశాలకు ఎదురుగా శ్రీవారి గంధము తీయు అద్భుతమైన గంధపుసానరాయి ఉన్నది. ఇదియు దేవసేనకు ఇంద్రుడు అరణముగా ఇచ్చినదే అట. వందలకొలది సంవత్సరములు ఎడతెగక దీ మీద గంధముతీసినను ఈ రాయి కొంచమైనను అఱుగక అందము గనేయున్నది. ఇందుతీయు గంధమును స్వామివారికి మెయిపూతగ అలంకరించి, పిమ్మట, భక్తులకు శ్రీవారిమెయిపూత (శ్రీపాదరేణు) అను ప్రసాధముగ ఇవ్వబడుచున్నది. సమస్త వ్యాధులను తీర్చు ఔషదముగ భక్తులచే ఎంచబడుచున్నధి అటులే వాడబడుచున్నదికూడ. దీనిని తెలిసినవారు తమకు ఈయబడిన శ్రీపాదరేణువును భద్రముగతమ వద్దనుంచుకొని రోజూ మిరపగింజ ప్రమాణము లోనికి తినుచుందురు.

ఈశాన్యమూలలో సమీపమున రుద్రాక్ష విమానమందు ప్రధానమైన పెద్దఉత్సవమూర్తి వెలసియున్నారు. ఈ విమానము యొక్క పైభాగ మంతయు రుద్రాక్షపూసలతో చేయబడినదే. ఇది భక్తులచే దర్శించ దగినది. తూర్పు ప్రాకారమునకు ఉత్తరమున షణ్ముఖమూర్తి ఉన్నారు సాయింకాల అభిషేక సమయమున, ప్రదోషకాలమున, సుమారు 6—30 గంటలకు వీరికి దీపారాధన జరుగును. తర్వాతనే మూలస్థానపుస్వామికి అభిషేకం పూజ. సాయంధీపారాధన మొదలగునవి. జరుగును. షణ్ముఖ స్వామికి తూర్పున ఆపత్సహాయ గణపతి వేంచేసియున్నారు. వీరికి దక్షిణమున నున్న మేడలో అరుణగిరినాధుడు ప్రత్యేక విమానమున వెలసియున్నారు. వారికి దక్షిణమున నవవీరులున్ను ఉన్నారు. ఈ నవవీరులందఱికిని దక్షిణమున కడపట నుండునది. వారిలో ప్రదానియగు వీరబాహుదేవుడగును. వీరబాహుదేవునకు ధక్షిణమున సూర్యమూర్తి యున్నాడు. ఉదయకాలపు పూజ వీరితోనే ప్రారంభించబడును, ఈ ప్రాకారమునకు పోవు ఐదు మెట్లు ఉన్నవి. ఇవి పంచాక్షర మెట్లు అనబడును

# మూడవ ప్రాకారము

పంచాక్షరమెట్లు దాటుకొని లోనికిపోయిన తపనమంటపము ఉండును. దానిని దాటినవెంటనే అర్ధమంటపము ఉన్నది. ఇట దక్షిణమున తపనవినాయకుడు ఉండును. దీనినికూడ దాటి లోనికిపోయి లోమంటపమునందు నిలిచే "జ్ఞానశక్తిధరుడు" అను తణికాచల సుబ్రహ్మణ్యస్వామివారిని దర్శనము చేసుకొనవలెను.

కార్తికేయునికిగల విగ్రహముల గూర్చి శిల్పశాస్త్రములో పలు రీతులుగ చెప్పబడియున్నది. అనగా: 16 విధములు అగు విగ్రహములు కలవు. అందులో "జ్ఞానశక్తిధరుడు" అను విగ్రహము ఒకటియగును సుబ్రహ్మణ్యునియొక్క రెండుచేతులలో ఒక చేత శక్త్యాయుధమును ధరించి మఱియొకచేతినీ కటిపై (నడుముమీద) నుంచుకొని నెమిలి లేకయే ప్రత్యేకించి నిలిచియున్న వైఖరియే "జ్ఞానశక్తిధరుడు" అను విగ్రహమగును. తిరుత్తణి సుబ్రహ్మణ్య స్వామి "జ్ఞానశక్తిధరు"డనే స్థితియందె వేంచేసి వెలసియున్నారు. ఈ రూపుయొక్క శ్రేష్టతవిమును సహజత్వమును ఈ క్రింది విధముగ తిరుత్తణిగై పురాణమునందు చెప్పుచున్నది.

చెంగల్వపూ గొన్న - చెను మీ తొకచేయి
చెంగలించక తొడ - జేర్చి, పొన్న
మేడు పర్వతవాసి - మిగుల దయానిధి
పరశివు శక్తిని - వంగు చేత
బట్టి, పొంగెడి దయా - పలతయు నొకకంట
జాలువారుచు నుండ - చాల విరస-
నముగల్గు మోముతో - నందాల చిందెడి
జ్ఞానశక్తిధరుని - కను లగాంచి,
యచట నుల్లమలర నతినియందే లగ్న-
మైన మనసుతోడ - మనన జేయు-
వార లెల్ల నతని - ఇరవొంది. యాతడె
యగుచు నుందురనుట - యగును నిజము

(తణికాచల పురాణము)

వైపద్యమున కనబడుచున్న విధమునకు తగినటులు తణికాచల స్వామి దక్షిణ హస్తమున త్రిదశ శక్తియగు జ్ఞానశక్తిని ధరించి యున్నాడు. వారి వామహస్తము వామాంకమందు అమరియున్నది. కార్తికేయుడు నెమిలిలేక నిలిచియున్న అందమైన శ్రేష్ఠవిగ్రహము ఇదియేయగును. ఈ అందమైన శ్రీవారి విగ్రహమునుకని ఆశ్చర్యము చెందియె;

"తణిగమలతంద్రీ — అందమగు పెరుమాళ్ళే; (233)
"తణిగలో వినలేనివాడు" (289)
అని అరుణగిరినాధుడును.
"తణిగమల చేరుదునో, సామి అందము జూతునో"

అని రామలింగస్వామియు, జ్ఞానశక్తిధరుడగుతణికాచలవాసుని అందమునకు అబ్బురపడి, కీర్తించియున్నారు.

విభూతి, నైర్మాల్యము శ్రీ పాదరేణు వనువాసీని భక్తులకు అర్చకులగు శివాచార్యులు ఇచ్చుచుందురు. మూలస్థానమందుఇరువైపుల భోగశక్తులగు దేవసేనః వళ్ళియమ్మలు ఇరుపురును కలరు. శ్రీవారిని, దేవసేనావలీ అమ్మవార్లను సేవించుకొని బయట వచ్చినదే కనబడు తూర్పుప్రాకారపు ఉత్తరమున దేవసేనసన్నిధియు. దక్షిణమున వళ్ళియమ్మ సన్నిధియు. దర్శించుకొనవచ్చును. దేవసేనకు కుడిచేతి నీలోత్పలమును, వళ్ళిదేవికి ఎడమచేతిలో తామరపూవును కలిగియున్నారు వానిని చక్కగా గమనించి తెలియవలసియుండును. వళ్ళియమ్మను దర్శించి వెంటనే లోప్రాకారమున తిరిగివచ్చిన పశ్చిమప్రాకార మధ్యమున బాలసుబ్రహ్మణ్య సన్నిధికలదు. వీరికి ఆరుద్రాదర్శన ఉత్సవకాలములో వేడినీటిస్నానము (అభిషేకము) చేయింతురు. ఉత్తరప్రాకారమున సుమత్రేశ్వరుడు. చండీశ్వరుల సన్నిదానము లున్నవి. ప్రాకారమునకు వాయు మూలలో శయనాగారమున్న. ఈశాన్యమున భైరవుని సన్నిధులును కలవు.

# ఉత్సవములు

ఉత్సవములు ను విశేషదినములున్ను తిరుత్తణిలో ప్రతినెల యందును వచ్చుచుండును. కృత్తిక దినములే విశేషదినములగును. ఆరోజు సుమారు 50 వేలమంది భక్తజనులు వచ్చుచుందురు. ఆడి (ఆషాఢ) కార్తిక. తై (పౌష్య) మాశి (మాఘ) మాసములలోని కృత్తిక రోజులలో ఆడికృత్తికయే మిగుల శ్రేష్ఠమైనదిగ నుండును. ఆనాడే శరవణ తటాకమును తెప్పోత్సవము జరుగును. ఈ ఉత్సవము వరుసగా మూడు రోజులు జరుపబడుచుండును. సుమారు 8 లక్షల భక్తజనులు ప్రేక్షకులు గా ఆ ఉత్సవమున పాల్గొందురు.

ఒక సంవత్సరములో ఇచట రెండు బ్రహ్మోత్సవములు జరుగుచుండును. మాశి (మాఘమాసం) నెలలో వళ్ళియమ్మతోను. చిత్రినెల (చైత్ర మాసం) లో దేవసేనతోడను కళ్యాణోత్సవములు జరుగుచుండును. మాశి బ్రహ్మోత్సవమున 8-వ దినము వళ్ళివివాహము ఎగువ తిరుత్తణిలో జరుగును. ఆ సందర్భమున వళ్ళిచరిత్రమునందలి పలు ఘట్టములు ప్రదర్శించబడును.

శూరపద్మునితో చేసిన పోరునకు తర్వాత ఇచట కుమారస్వామి తన కోపమును శమింపజేసికొని వేంచేసియుండుటచేత తక్కిన స్థలములవలె ఇచ్చట "శూరసంహారము" జరిపించుటలేదు. అందుచే స్కంధషష్ఠి (సుబ్బరాయని షష్ఠి) ఉత్సవము. ఇచట వైదిక పద్ధతిలో జరుగును. అపుడు యంత్రపూజయు జరుగును. ఆయాలు రోజులలోను పెద్దమూలవిగ్రహమునకును, ఆఱుముగస్వామికిని అభిషేకాదులు జరుపబడును. ఆఱోరోజు ఆఱుముగస్వామి ఉత్సవము జరుగును.

మాశి శివ (మాఘమాసంలో వచ్చు మహాశివ) రాత్రినాటి రేయి ఇచట స్వామికి 1008 శంఖాభిషేకము జరుపబడును.. ఇదిచూచి ఆనందించదగినది. ఒక్కొక ఆనినెల (జ్యేష్ఠమాసము) 28-వ తేదిలో వర్ధంతి యను ఉత్సవము జరుగును. ఆనాడు 108 శంఖాభిషేకము జరిపించి సాయంకాలమున విశేషదీపారాధన జరుపబడును. రాత్రియందు వెండినెమిలి వాహనము నారోహించిన స్వామివారి దర్శనము చూచి ఆనందించ దగినదెగాని, చెప్ప తరముగాదు.

ప్రతి సంవత్సరము డిసంబరునెల 31-వ తెదియందును జనవరి 1-వ తేదీలోను తిరుప్పుగళ్ సభవారును, సుబ్రహ్మణ్య భక్తులును ఇచ్చట గుమిగూడి భజనలు సలిపి శ్రీవారిని దర్శించికొని వెళ్ళుదురు. దీనిని పడిఉత్సవము అందురు. ఈ తిరునాళ్ళు ప్రతి సంవత్సరము వృద్ధి యగుచు వచ్చుచున్నది. పలులక్షలకొలది జనులు అప్పుడు ఇచ్చట కూడుచుందురు. ఈ ఉత్సవమున ప్రత్యక్షముగ పాల్గొని, దర్శించి అనుభవించదగినదే గాని చెప్పుటకు తరము కాదు

ప్రతిసంవత్సరము చిత్తిరినెల 1-వ తారీఖు [తమిళసంవత్సరాది నాడు] ఆఱుముగస్వామివారి గుడివద్దనుండి 1008 పాలకడవ [క్షీర కలశము]లు తీసికొనివచ్చి కొండమీద స్వామివారికి అభిషేకము చేయుచున్నారు. ఇదియు కనుల పండువుగనుండు ను.

తిరుత్తణి ఒకగొప్ప ప్రార్థనాస్థలము. తనపై భక్తి కలిగి ప్రార్థించుకొను భక్తులకు, వారికి కావలసిన వరములు, మేళ్ళను కలియుగమున ప్రత్యక్ష దైవమగు సుప్రసిద్ధ తణికాచల పెరుమాళ్ దయపాలించుచుండును. తిరుపతి కొండకు వెళ్ళెడి భక్తజనులు అచటికి పోవుటకుముందో లేక అచటికిపోయి తిరిగివచ్చునపుడో ఇచటికి వచ్చి స్వామిని దర్శించి పోవుటచేతనే వారి మ్రొక్కులు సఫలమగునని పెద్దల అభిప్రాయము అందుచేతనే తిరుపతికి పోయివచ్చు యాత్రీకులకు అన్నమిడుటకై ధర్మ సమాజములు ఏర్పడియుండుటను, వేయి సంవత్సరములకు ముందుండినవిగా, ఇచటి శిలాశాసనములు తెలిపించుచున్నవి.

## పూజా సమయములు

| | | | |
|---|---|---|---|
| 1 | విశ్వరూప దర్శనము | — | ఉదయం 6-00 గంటలకు |
| 2 | ఉదయ సంధ్యాభిషేకము | — | ఉదయం 8-00 గంటలకు |
| 3 | మధ్యాహ్న అభిషేకము | — | ఉదయం 10-00 గంటలకు |
| 4 | సాయంకాలాభిషేక పూజ | — | సాయంత్రం 5-00 గంటలకు |
| 5 | అర్ధజామ పూజ | — | రాత్రి 8-00 గంటలకు |
| 6 | శయనాగార పూజ | — | రాత్రి 8-45 గంటలకు |

గమనిక:— ప్రతి ఆదివారము కృత్తిక మరియు విశేష దినములలో వేకువజామున 3 గంటలకు శ్రీవారికి అభిషేకము జరుపబడును. ఆరోజులలో 8 గం॥ 10 గం॥లకు జరుగు అభిషేకములు ఉండవు.

# తిరుత్తణిలోగల ఇతర చిన్నగుళ్ళు

1 తిరుత్తణి రైల్వే స్టేషనకు 1/2 కి. మీ. దూరమున నందియేటి గట్టున వీరాట్టహాసేశ్వర దేవాలయమున్ను విజయరాఘవస్వామి ఆలయములను కలవు. ఇవి చాల పురాతనమైనవి; పల్లవుల కాలమునాటివి. వీనియందు పురాతన శాసనములు కొన్ని కానవచ్చుచున్నవి.

2 సహస్రేశ్వర దేవాలయము:— ఇది కోనేటియొక్క తూర్పు తీరమందున్నది. పశ్చిమాభిముఖ ద్వారముతో నమర్చబడియున్నది. దేవియొక్క పేరు జ్ఞానాంబిక.

3 వీరభద్రస్వామి దేవాలయము:— కోనేటికి తూర్పున ప్రాత సన్నిధి వీధిలో, వీధికి ఉత్తరమున ఉన్నది. ఇది ఇటీవల జీర్ణోద్ధారణ గావించబడినది.

4 సరస్వతీశ్వరసన్నిధి, బ్రహ్మేశ్వరసన్నిధి చెంగల్వవినాయక సన్నిధి, ఏకాతమ్మసన్నిధి, పడవేట్టమ్మ సన్నిధులన్నియు కొండమీదనే యున్నవి.

5 తిరువాలంగాడు:— ఇట వటారణ్యస్వామి దేవాలయము ఉన్నది ఈ చోటు అరకోణమునుండి మదరాసుకుపోవు రైలు మార్గమున, రైల్వే స్టేషనుకు ఉత్తరమున 3 కి. మీ. దూరమున ఉన్నది. ఇది పురాణ ప్రసిద్ధిగాంచిన పురాతన దేవాలయము. ఇచట జరుపబడు ఆరుద్రా ప్రదర్శనము చాలసుప్రసిద్ధము, సర్వపాపహరమునగును. ఇది శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానమువారి పర్యవేక్షణక్రింద జరిపించబడుచున్నది.

6 తిరుప్పాచ్చూరు:— ఇచట పాచూరునాథస్వామివారి దేవాలయమున్నది. ఇదియు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానమువారి పర్యవేక్షణ క్రిందనే జరుపబడుచున్నది.

7 నెడంబరం:— ఇచట కోదండరామస్వామి దేవాలయమున్నది

8 కరుంబేడు:— నాథాధీశ్వరస్వామి దేవాలయము ఇచట ఉన్నది

9 పెద్దనాగపూడి:— ఇట నాదలీశ్వరస్వామిగుడి ఉన్నది

10 వేపగుంటపాళెం:— సంతానవేణుగోపాలస్వామి ఆలయము ఇచట ఉన్నది

పైకనబఱచిన దేవాలయములన్నియు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానము పరిపాలన క్రిందనే జరుగుచున్నవి. ఆఱుముగస్వామి గుళ్ళలోగల శిలాశాసనములు అనేకముగ పల్లవులు. చోళులకాలము నాటివి. వీరాట్టహాశ్వర దేవాలయ గర్భస్తూపము పల్లవులకాలపు శిల్పములు కలపిగ చక్కని నల్లరాలతో చేయబడి అందముగనున్నవి.

సుమారు 30 సంవత్సరములకు ముందుండిన జ్ఞానమ్మ అనే వృద్ధ భక్తురాలు ఆఱుముగస్వామి. వీరాట్టహాసేశ్వరస్వామి దేవాలయ ప్రాకారములను జీర్ణోద్ధారణ చేయించెను. ఆఱుముగస్వామి గుడికిగాను పట్టాభిరామాపురం గ్రామంలో కొంత భూమినికూడ దేవాలయమునకు దత్తతము చేయించెను ఈమెపేరు నేటికిని తిరుత్తణిపురవాసులచే పొగడబడుచున్నది.

## ఉత్సవ కాలములు

| | | |
|---|---|---|
| 1 | శ్రీవళ్ళియమ్మ పెళ్ళి | ఫిబ్రవరి, మార్చి |
| 2 | శివరాత్రి 1008 శంకాభిశేకము | మార్చి |
| 3 | శ్రీ దేవసేన వివాహము | ఏప్రిల్, మే |
| 4 | ఆడి కృత్తిక తెప్పోత్సవము | జూలై ఆగస్టు |
| 5 | షష్ఠి ఉత్సవము | అక్టోబరు నవంబరు |
| 6 | తిరుప్పంగళ్ తిరుప్పడి భజనోత్సవము | డిసంబరు-31 జనవరి-1 |

## ప్రత్యేకమార్గ దర్శనము

| | |
|---|---|
| సాధారణ రోజుల్లో ప్రత్యేక మార్గదర్శనము | మనిషి 1-కి రూ. 2 |
| సాధారణ దినములలో స్పెషల్‌దారి దర్శనకట్టుము | 5 |
| ఆడికృత్తిక తిరుప్పడి భజన ఉత్సవాదులలో ప్రత్యేక మార్గదర్శనము | ,, 5 |
| ఆడికృత్తిక తిరుప్పడి భజన ఉత్సవ సందర్భాదులలో స్పెషల్ మార్గదర్శనము | 25 |

## అభిషేకసామానులు కాక కట్నము వివరములు

| | | |
|---|---|---|
| 1 పంచామృతాభిషేకము, మూలవరుకు | రూ | 40-00 |
| 2 ,, ఇతర సన్నిధులకు | రూ | 5-00 |
| 3 విభూతి అభిసేక కట్నము | రూ | 5-00 |
| 4 పన్నీరు ,, | రూ | 5-00 |
| 5 చందనం ,, | రూ | 5-00 |
| 6 పాలు ,, | రూ | 5-00 |
| 7 పెరుగు ,, | రూ | 5-00 |
| 8 తేనె ,, | రూ | 5-00 |
| 9 నాటుచక్కెర అభిషేక కట్నము | రూ | 5-00 |

## కావడి కట్నవివరము

| | | |
|---|---|---|
| 1 విభూతి కావడి కట్నము | రూ | 5-00 |
| 2 పాలు కావడి ,, | రూ | 5-00 |
| 3 నాటుచక్కెర కావడి కట్నము | రూ | 5-00 |
| 4 పూలు కావడి కట్నము | రూ | 1-50 |

సూచన:- అభిషేక సామాను సహా మూలవర్లకు
పంచామృతాభిషేకమునకు కట్నము మొత్తము రూ 175-00

## అర్చనలు

| | | |
|---|---|---|
| 1 సాధారణ దినములు | | |
| మూలవర్లు, ఉత్సవర్లు, షణ్ముగస్వామి | | |
| అష్టోత్తర అర్చన | రూ | 1-00 |
| కృత్తిక, మరియు విశేష దినములలో అర్చన 1-కి | రూ | 2-00 |
| 2 సహస్రనామార్చన 1-కి | రూ | 25-00 |
| 3 త్రిశతి అర్చన 1-కి | రూ | 5-00 |
| 4 అమ్మవార్ల సన్నిధి అర్చన 1-కి | రూ | 0-50 |
| 5 హారతి 1-కి | రూ | 0-25 |

## తదితరములు

| | | |
|---|---|---|
| చెవులుకుట్టు | రూ | 1-00 |
| వివాహము (పెళ్ళి) జరుపుకొనుటకు కట్నము | రూ | 25-00 |
| తలనీలాలు తీయుట | రూ | 1-00 |

## అలంకార కట్నములు

| | |
|---|---|
| మూలవరు రత్నకిరీటము షణ్ముక పతకము | రూ 75-00 |
| స్వర్ణకిరీటము 1008 బిల్వమాల | రూ 101-00 |
| స్వర్ణకవచము | రూ 151-00 |

## ఉభయ కట్నములు

| | |
|---|---|
| స్వర్ణరథోత్సవ ఉభయ కట్నము | రూ 505-00 |
| వెండి రథోత్సవం కట్నం | రూ 751-00 |
| కళ్యాణోత్సవ కట్నం | రూ 351-00 |
| వెండి నెమిలి వాహనము | రూ 551-00 |
| కేడయ ఉత్సవం | రూ 125-00 |

## ఇతర కైంర్యములు

రూ. 1001/- చెల్లించినయెడల అందులోరాగల వడ్డినుంచి సంవత్సరములో 1 దినము మీ పేరుతో పుష్పాంజలి పారంపర్యముగా జరుపడును.

సాయంకాల పూజ అయినదే 200 మంది భక్తులకు ఉచితముగా ప్రసాదములు నొసంగుటకు రు. 1001/- చెల్లించిన యెడల మీకు యిష్టమైన రోజులో ఒక పర్యాయము పారంపర్యముగా జరుపించబడును

| | |
|---|---|
| సాధారణ దినము లలో అర్చనచేసి ప్రసాదము తపాలులో పంపించుటకు | రూ. 10-00 |
| కృత్తిక మఱియు విశేష రోజులలో | 12-00 |
| సం॥ 1-కి 13 కృత్తికలో అర్చనచేసి ప్రసాదము తపాలులో అంపించుటకు | 150-00 |

ఉభయములకు ధనము నొసంగువారు "నిర్వహాణాధికారి శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానం. తిరుత్తణి-631209" కు పంపించవలయును



తణిగై ఇల్లం (48 గదులు కలిగినవి)

గదులు దినము 1-కి (24 గంటలసేపు) బాడుగ వరములు:-

| స్థలము | సంఖ్య | బాడుగ 1-కి | అనుమతించు మనుష్యులు |
|---|---|---|---|
| | | Rs. | |
| 1 శరవణ తీర్థగట్టులోని అరలు | 37 | 15 | 3 |
| 2 నాగవేశు సత్రము అరలు | 25 | 5 | 2 |
| 3 తణిగై ఇల్లం | | | |
| అ] 3 పడకల గదులు | 7 | 25 | 4 |
| ఆ] 2 పడకల గదులు | 41 | 20 | 3 |
| ఇ] చిన్న గదులు | 8 | 10 | 2 |
| 4 తణిగై ఇల్లం కుటీరములు:- | | | |
| మొత్తం కుటీరములు | 36 | 35 | 6 |
| అ] విభాగము | | 20 | 3 |
| ఆ] విభాగము | | 15 | 3 |
| ఎ. సి. క్రింది దశము | 3 | 60 | 6 |
| 5 కార్తికేయ కుటీరములు (బస్సుకొండదారి ప్రక్కన) | | | |
| మొత్తం కుటీరములు | 52 | 30 | 6 |
| అ] విభాగము | | 15 | 3 |
| ఆ] విభాగము | | 15 | 3 |
| 6 కార్తికేయజా మొత్తం అరలూ | 48 | 15 | 4 |

కొండకు రహదారి:- వాహనములు కొండమీదికి పోయి వచ్చుటకు అనువుగా రహదారి అమర్చబడి యున్నది.

సేవించుటకు వసతి:- కొండమీద దేవాలయమునకు పోయి వచ్చుటకు దేవస్థానమువారి తరపున బస్సువసతి చేయబడియున్నది కట్నము మనిషి 1-కి రూ. 2-00. ఒకే ప్రయాణపుచీటి (టిక్కెట్టు) తో కొండమీదికి వెళ్ళి స్వామివారి దర్శనాదులు ముగించుకొని అదే టిక్కెట్టుతో తిరిగిరావచ్చును.

బాలుర శరణాలయం:— దే వా ల య నిధిలో నుండి దీనిని నడుపుచున్నారు. బాలుర విద్యా సౌకర్యమునకై వారికి ఆహారము బట్టలు (ఉడుపులు) మొదలగునవి ఈయబడుచున్నది.

కళాశాల:- దేవాలయ నిధినుండి 5 లక్షల రూపాయలు మాన్య మొసగి "శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ప్రభుత్వ కళాశాల" నొకదానిని ఏర్పాటుచేసియున్నారు.

పుస్తక భాండగారము:- మాజీరాష్ట్రపతి, డా॥ రాధాకృష్ణన్‌గారి చేతో ఈ దేవస్థానమువారు ఒక పుస్తక భాండాగారమును నడుపుచున్నారు.

సిద్ధ వైద్యశాల:- దేవస్థానమువారు 1973 లో సిద్ధవైద్యశాల నొకదానిని ఏర్పాటు గావించి నడిపించు చున్నారు.

న్యాయధరలకొట్టు :— కొండలో సేవార్థుల సౌకర్యంగా అర్చన పుష్పలు పళ్ళు పుస్తకములు డాలర్లు ఉంగరములు సంచులు కాలెండర్లు మున్నగునవి న్యాయమైన ధరలకు దేవస్థానమువారే విక్రయించుచున్నారు.

ప్రసాదములకొట్టు :- ప్రసాదములు తయారుచేసి భక్తులకు న్యాయమైన ధరలకు అమ్మబడుచున్నవి.

కల్యాణ మంతపములూ:— తక్కువ కట్నాలతో పెళ్ళిళ్ళు జరుపుకొనుటకు కల్యాణ మంటపములను దేవస్థానమువారు నిర్మించి యున్నారు, కొండమీదగల ఆఫీసులో రు. 25 లూ చెల్లించి వివాహము జరిపించుకొనవచ్చును.

నిర్వాహము:- ఈ దేవాలయము హిందూమత దేవాదాయధర్మదాయ శాఖవారి ఆధిపత్యమున సహాయకమీషనరు / కార్యనిర్వాహణాధికారిచే నిర్వహింపబడుచున్నది. ప్రస్తుతము శ్రీ ఎన్. ఎస్. రామచంద్రన్, బి.ఎ.బి.ఎల్., గారిచే కార్యనిర్వహణము చేయబడి, నిర్వాహకవర్గము వారి మూలమున పరిపాలింపబడుచున్నది.

